నివాసమైన సత్యలోకము శిరస్సు, కటిప్రదేశ మతలము, తొడలు వితలము, పిక్కలు సుతలము, మీఁగాళ్లు తలాతలము, మడమలు మహాతలము, పాదముల ముందుభాగము రసాతలము, అరకాలు పాతాళము. మఱికొందఱు పాదతలమువలన భూలోకము,నాభివలన భువర్లోకము, శిరమువలన స్వర్లోకమును గలిగెనని చెప్పుదురు. పదు నాల్గు లోకము లనునది యొక విధమైన యుపాసన, ఏడులోకము లనునది యింకొక్కతెఱఁగైన యుపాసన, మూఁడులోకము లనునది మఱియొక పద్ధతి, ఈ మూఁడు భేదములును నధికారి భేదములతో నుపాసింపఁదగినవి. అందుచే మూఁడును సమాదరణీయములే.

పుట్టపర్తి నారాయణాచార్యదాసునిచే విరచింపఁబడిన
'శ్రీ భాగవత సుధాలహరి' యందు ద్వితీయ
స్కంధమున పంచమాధ్యాయము
వ్యాఖ్య ముగిసినది.

